# నతి

"పథా గురోః పాదనపూతగంధినా
గిరా గురోః కీర్తనబంధురశ్రియా
హృదా గురోః భావనపావితాస్పృశా
భవే దియం మే కవితాప్రయాత్రా"

# తర్పణము

నా తండ్రి! వినవయ్యా!
నీ తంత్రీకృతమ్ము, చారుజీవవృత్తము, సం
గీత మృదుపాక మధురము,
చేతో మోహనము త్యాగశీలము కలిమిన్. ౧

తంనాథుల మా బ్రతుకుల
వెలిగించితి మెఱుపుతీఁగె వెలిగించినటుల్
ఇల వేలుపువై యిటుపై
వెలిగింపుము నీకులమ్ము వెన్నెలవోలెన్. ౨

నీ జన్మ మమృతబంధము,
నీ జీవిత మమృత రస ధుని సదృశము, నీ
శేషమ్మమృత పయోనిధి
నీ జనువున మా తనువు పునీతము బాబీ! ౩

తొమ్మిది వసంతములలోఁ
దొమ్మిది జన్మముల లీలఁ దోఁపించితి నీ
యమ్మయు, నయ్యయు, బంధులు
నెమ్మెయి మఱువంగ నేస్తరీ జన్మములో! ౪

# తర్పణము

నా యాశాలత లెల్లఁ
నీయందే పాదుకొనియె; నీవే నేనై
నా యాశయ మూర్తులకున్
బోయుదు దీర్ఘాయు వనుచు పొంగితి తండ్రీ! ౧

ఏటి కొకతూరి నా క
న్నీటిం గనుఁగొన్న మనసు నిండదొ నీకున్
మాటికి గుండెల లోతుల
దూఁటి పెకల్చెదవు బాష్పతోయము బాబీ! ౨

చావెఱుఁగక కల్పాంతము
జీవింత్రు భవాదృశ మృతజీవులు తండ్రీ!
జీవచ్ఛవముల కైవడి
మావంటి యభాగ్య జనులు మనుదురుగాకన్. ౩

ఈ నాపై నీకెంతటి
ప్రాణమొ! భద్రముగ నాదు ప్రాణమ్ముల నీ
ప్రాణమ్ముల నిడిపోతివి
నానయ్యా! వదల వొక క్షణమ్మును నన్నున్. ౪

మోకరిలి కరయుగమ్మున
నా కాళులఁ బట్టి శిరము నయనమ్ములనున్
బోఁకంగ నిండు భక్తిని
నాకున్ బ్రణమిల్లరావె నా కన్నయ్యా! ౫

# నివేదిక

ఈ రచన యారంభింపఁబడి యిప్పటికిఁ బదునాలుగేండ్లయినది. పదియేండ్ల క్రిందట నా కవితా వ్యాసంగమున కేర్పడిన యంతరాయము నేఁటివఱకుఁ దీరకుండుటయే యీ రచన యిట్లు మూలఁబడుటకు ప్రధాన హేతువు. ఇటీవల నేలనో మరల నాలో కవితాసక్తి తలసూపఁ దొడఁగినది. వారుణి వెలుఁగు మొగము చూచుటకీ యాసక్తి యొక కారణము. పలువురు మిత్రులు వారుణి ముద్రితమైనఁ జూచి సంతసింపఁగోరుచున్నారు. వారి ముచ్చట దీర్చుటకే యీ ముద్రణము.

ఇందలి కథాంశము "రాజస్థాన కథావళి" లోని "హమీరు" కథలోనిది. సంవిధానము, పాత్రీకరణము నావి. దీనిని ప్రకటించి మిత్రుల మనోరథ మీడేర్చితినని సంతసించుచున్నాను.

బాపినగర్, }
22—7—1947 } మాధవశర్మ

# ప్రవేశిక

"అహేరియా" పండుగనాఁడు అడవిపందిని వేఁటాడుట రాజపుత్రుల యాచారము. చిత్తోడు యువరాజును గికురించి యొక యడవిపంది చారుణి కాపున్న జొన్న చేనిలోఁ దూరును. యువరాజు సభటముగా నట కరుదెంచి చారుణిఁ గాంచి యనుచున్నాఁడు.

ఓమ్

# వారుణి

ఓ రమణీయమూర్తి ! దయ
యుంచి యొకించుక జొన్నచేనిలోఁ
దూరిన యేకలమ్మ వెల్ద్రో
యుదాశ వండినచేని మట్టఁగా
నేరక వేచియుండిన వి
సితుల నీదారలక్ష స్వయమ్ముగాఁ
దూరఁగ నాజ్ఞనే యొసఁగ
దోశ వచియింపుము వేగ ! కోమలీ ! ౧

పాటెడు నార్తి నేన దిగఁ
బాటను చెమ్మటలేని పుచ్చుఁగాఁ
దీటికలేని యీ దారల
తీరు. కనుంగొని, నష్టకల్పనై
పీటేఁడి వా్రు నీపగటి
వేటపయిం గనికారముఁంచి, కృం
గారవతీ! చిత్తోదు మహి
కాంతున కించుక సేయు సాయమున్ ! ౨

జవమున దీనినందుకొనఁ
జాలక తేలికఁ దూలిపోయె వె
దవిలి చలమ్మునన్ విసరు
నా విలుకాండ్రు శరప్రకాండముల్;
యవనతురంగమూర్ధిక ర
యూహమికన్ గికురించి ఘుర్ఘురా
రవభయదాట్టహాస నిక
రమ్మయి డాఁగిన యిక్కటీంద్రముల్ ౩

పొల మెడలించి యోతలిరుఁ
బోఁడి! చితోడు కుమారసింహు మె
ప్పులు గడియించుకొన్న యశ
ముం దగఁ గొమ్మని సాధువై ఖరిం
బలికిన రాకుమారు జయ
వాచక పూర్వము గౌరవించుచున్
గలువల జోడుసేయు తెలి
గన్నుల తీయని చూపు చూచుచున్ ౪

బాలశశాంక రేఖయగు
ఫాలమునం జెరలాడు ముంగురుల్
కేలి మయింబలెం దలిరుఁ
గేలఁ దెమల్చుచుఁ బాలవన్నియల్

వాలిన నవ్వులన్ సెలవి
వారఁగఁ దీయని కంఠమెత్తి భూ
పాల కుమారు నెమ్మొగము
వంకకు మో మఱదిప్పి యిట్లనున్. ౫

"దేవరవారి మాఁపొలము
దిక్కున రాకడ లెప్ప! సర్వముం
పావనమయ్యె మాప్రభుని
పాదము మెట్టినమెట్టనేల! మా
తావులుసోఁకి మావయిరు
దాలిచెఁ జందన గంధలక్ష్మి! యీ
సేవకురాలిచేన విరిసెన్
కనకమ్ములు జొన్నకంకులై! ౬

సమదవిలాసముల్, మనుజ
శాసన దూషితవాసనాదవి
ష్ఠములు, నిరంకుశమ్ములయి
స్వైరగతిం జరియించు నీయర
ణ్య మృగనికాయముల్ ప్రభువు
లన్నను జంకవు! రాజసన్నిధి
క్రమము లెఱుంగవు! ఓరువవు
రాజభటావళి శాసనమ్ములున్! ౭

కత్తులకంటెనుం గఱకు
గాఁ గొన లేచిన యాకు లొత్తుగా
మొత్తములైన యిట్టి పొల
ముం దమ యోధులు చొచ్చుమాట యే
ఉత్తది! చొచ్చిరేనియును
నుక్కున వ్రక్కలుసేయు నిక్కటిఁ
దెత్తురె చేనివేల్పులకు?
దేవర! యేటికి రిత్త యత్నముల్? ౮

ఉన్నత ఘోటక ప్రకర
మూర్జిత గంధగజేంద్ర యూధము
ద్యన్నిశితాశుగవ్రజము
వ్యర్థములై చనినట్టిచోట మా
జొన్నలదంటు చేవయును
జొన్నలకఱ్ఱ యలుంగు వాఁడియున్
జొన్నల బువ్వలోని పస
చూపుదునా విలుకాండ్రకున్ ప్రభూ! ౯

అరమర లేక మోటకు క్రి
యం దల నడ్డము త్రిప్పికొంచు ని
వ్వెరున ప్రగల్భముల్ పలుకు
బాలికమాటల కబ్బురంబుతో

వెలుఁగు జనింప రాసుతుఁడు
వెక్కసమౌ తన చూడ్కి సాటి వేఁ
టరుల మొగమ్ములం దగప
డం గని వల్లెయటంచుఁ బల్కినన్. ౧౦

ఆపెయు వేఁటకాండ్రవప
హాసము, రాసుతు మందహాసమున్
దోఁపఁగఁ గన్నుదమ్ములెగఁ
దోయుచుఁ దిన్నని చూపుచూచి లీ
లావరిహాసశింసి మృదు
లస్మితమై, విమలాంగరేఖకా
గోపన దూషితార్థ మల
గుంఠితచేలము బిగ్గఁగట్టుచున్. ౧౧

నిక్కి నవ్వుఁగు చన్దవ నెగయుఁగట్టి
మోముదమ్మితేనియ లాన మునరు తేంట్ల
చందమున శేఁతచెక్కులఁ జిందులాడు
ముంగురుల నెగఁదోచి కొమ్మడి ఘటించి. ౧౨

జనపతిపట్టి నెమ్మొగము
చందురు కల్వలవోని వామలో
చనముల కోనల నదివి
సాలని చూపుల దొంగిలించుచున్

దనదేస రిచ్చవడ్డ నయు
    నమ్ములం దక్కురు నూడ మంచె డి
గ్గ నుతికి చేతి కందిన రొయొ
    కానొక తిన్నని జొన్నదంటుతో  ౧౩

తుట్టున చేని గర్భమునం
    దూరి భయంకర ఘుర్ఘుర ధ్వనిన్
జట్టులు బుట్టులాడుచు గ్రి
    సింపం బయింబడవచ్చు వందిం జే
గట్టి నదల్చుచున్ పొలము
    గట్టుకు తోలుక వచ్చి నిల్చి రా
కుట్టనితోటివారు పెను
    కోలల సేయగ నుద్యమించినన్.  ౧౪

వలదని చేతిసన్నల న
    వారణ వారల నిల్వరించి, కుం
తలములు మూంగి కొండొక వి
    ధమ్మగు నంధముం జిందుమోముతో,
మెలవున దంటుతో నదిమి
    మేదినిపైంగిటిం గూలందోసి డా
పలికయి వెన్క పాదములం
    బట్టి వరాహము నళ్రిమింబునన్  ౧౫

బిరబిర నీప్పుగొంచు పృథి
వీపతినందనుఁ జూచి పల్కె "దే
వర నవినీత వర్తనల
బాధలపెట్టిన యల్పజంతువుల్
ఖరనిశితక్షురప్రపరి
ఘుక్షురికాముఖ శస్త్రసంహతిన్
బారిగొన వచ్చినారలు ప్ర
భూ! తమ యోధశిరో వతంసముల్ ౧౬

ఏనుఁగు లెక్కి గుఱ్ఱముల
నెక్కియు కుంతములూని ఖడ్గముల్
పూనియు నిక్కటి న్ప్రభువఁ
బోరెడు వీరల కాజ్ఞ యిత్తువో ?
న్యాయల నాక - దేవర వి
నోదము చూడఁగవచ్చు - నొక్క సం
ధానము సేతు నాకు ప్రమ
దమ్మున నానతి యిత్తువో ప్రభూ ! ౧౭

తన యళికాలి త్రొక్కిళుల
దారుణ రోదన మాచరించుచున్
వెసఁగాడి వంద నద్భుతేఁవు
వీక్షలఁ జూచుచుఁ దన్మయాత్ముఁడై

వినమి నటించు రాకొమరు -
    వింటిగుణమ్మున జొన్నదంటు త్రో
పునఁ - దెలిపించుచు న్దలిరుఁ
    బోఁడి యిటుల్ వచియించె వెండియున్. ౧౮

"వీరికి మీకు నక్కజము
    వేఁగు జనించెడు భంగిమైఁ జమ
త్కార మొకండు సేయఁగ ము
    దంపడుదానను రాకుమార! మీ
వారు నృపాలనందనుని
    వంటి జగద్విదిత ప్రతాపుఁడౌ
శూరుఁడు గూడఁజూడఁదగు
    చోద్యము చూడక యెట్లు పోదువో!" ౧౯

అని కిటికింతనాళ విల
    యంకరమౌ నిజ వామపాద ము
ల్లనఁ బయికెత్తె; నక్కటియు
    లాగు బయల్పడఁ బాఱఁ జొచ్చినన్
గని వధియింప భల్లవిశి
    ఖంబుల రువ్విరి యోధులెల్ల ర
వ్వనితయు నొక్కదంటు గొని
    వైచె రయంబున నేర్పు మీరఁగా! ౨౦

గిరగిరఁ దిరిగి వరాహము
ధరణింబడె; యోధులెల్లఁ దమతమప్రజ్ఞా
భరమున నని కూలెఁ గిటి యని
యఱచుచుఁ బరువెత్తి రచటి కతిరభసమునన్. ౨౧

విలవిలఁ దన్నుకొంచు వృథి
విం బడిపోయిన పందిడొక్క న
వ్వాలనికి రాఁ దిగంబడియె
బాలిక వైచిన చంటుముక్క, యో
ధుల శరభల్లముల్ నడిమి
త్రోవన నేలకు రాలిపోయె! నా
లలనవయిం బడెం గనులం
లక్షలు కోటులున్న తటాలునన్. ౨౨

కటి ఘటించిన పాణియుగ్మమ్ముతోడ
మోముచందురుపై జల్లుమొయిలువోలె
ముసరు ముంగురు లొకవింతమురువు నూవ
మెలత యుత్తానదృక్కుల వలపు గదుర ౨౩

వామభుజమ్ము మీఁది కటి
వంగిన కోలమొగమ్ముతోడ న
క్కోమలి నవ్వి "మాచెలికుఁ
గోల యఱుంగులవేడి నూచితే

స్వామి!" యటంచు సైనికుల
　　చక్కికి గొండొక నిక్కి చూచినన్
వామునఁ డెల్విదోఁప నర
　　పుంగవుఁ డంగనఁ దేరిచూచుచున్. ౨౮

తడవుగ లోన నిల్చిన క
　　తమ్మన మిక్కిలి వెచ్చనైనదిన్
బాడవగు నూర్పు నొందు వెలి
　　బుచ్చుచు గుబ్బము డిగ్గ దూఁకి వె
ల్వాడ గమకించు బావ్పకణ
　　వారము గన్నులకోన లంద రూ
పడచుచు సిగ్గువడ్డ తన
　　హ స్తము నల్లన సాచి యర్మిలిన్ ౨౯

అలలితాంగి హ స్తమున
　　యందలి జొన్నయలుంగు వట్టి కెం
గేలఁ దెమల్చి యట్టె వరి
　　కించె నిజాననలగ్నదృష్టియై
బాలిక ముద్దునెమ్మొగము
　　పార్వణచంద్రునివంక త్రిప్పుకోఁ
జాలని యార్ద్రదృష్టులఁ బ్ర
　　సన్నతఁ దాల్చిన నెమ్మొగమ్ముతో. ౨౭

"ఓవిమలాంగి! ఓ త్రిభువ
నోద్వహానప్రతిభావిలాసినీ!
నీవు చిత్తోడు రాజ్యరమ
ణీమణివో! భయకృన్మృగావళీ
సేవితమైన యీగహన
సీమకు నేలికమైన దేవతా
స్త్రీవొ! మదీయజీవన వ
శీకరణాక్షమమంత్రమూర్తివో!" ౨౭

అని వినయాతిరేకమున
నశ్రులు చెక్కుల జాలువారఁ బ
ల్కిననృపసూతిఁ గన్గొని చ
లించిరి సైనికులెల్ల; నెమ్మొగ
మ్మునఁ జిఱునవ్వు దోఁప నర
పుంగవు నశ్రులఁ గేలిసేయు చా
డ్పునఁ బలికెం గుమారిక క
టుత్వము లేని దృఢస్వరమునన్. ౨౮

"నేను చిత్తోడురాజ్యరమ
ణీమణిగాను, మృగాధినేత్రియా
కాననదేవతారమణి
గాను; మఱెవ్వత వంటివేని, దూ

రాన నదో! వియద్గ్రహాణ
రాజనరాజిత, వ్యాఘ్రపర్వతా
సీన, చితోదురక్షణము
చేసెదు చారుణి! నేను చారుణిన్ !” ౨౯

అని తన దీర్ఘ మహా వికట
ఘోషనినాదము వ్యాఘ్రభూమిభృ
ద్ఘనతరకందరా కుహర
గర్భవిఘూర్ణన దీర్ఘదీర్ఘమై
వనము సమస్తముం గలఁచి
వైచి చెలంగిన వన్యకేంద్ర నం
దనుఁడు నసేవకవ్రికర
మద్భుతభావనిరుద్ధచేష్టుఁడై. 30

ఎత్తినతెప్ప వాల్పక త
దేకవిలోకనమూఢుఁడై తదా
యత్తమనస్కుఁడై యొక శి
లాకృతిఁ దాలిచి చూచుచుండఁగా
నత్తనుమధ్య తళ్కుమను
నంత గిటుక్కున సంభ్రమించి యు
వ్వెత్తుగ నొత్తుగా గుబులు
లేచిన జొంపములందు మాయమై 31

పోయె; భానుండు పశ్చిమాంభోధిగర్భ
దేహళీభాగవర్తియై దిక్కులందుఁ
జెఱలువోయిన తేజమ్ము చేతులారఁ
దగిలికొని యాత్మలోఁ బొందించుకొనియె. ౩౨

అయహస్కరు చరమసాంధ్యారుణిమలు
కృతకకాశ్మీరలేపనక్రియ లొసర్ప
పసవురుసలీను చేను శోభలు వహించెఁ
గన, వధూగర్భయగు పేరిలగంపవోలె. ౩౩

తొలఁగెను మూర్ఛ; భూపతిను
తుండు భటాళి కనుజ్ఞ యిచ్చె న
వ్వాలముగలంతటన్ వెదకి
ముద్దియవాడలఁ బట్టితేరఁ; వా
రలును బాలమ్ము పొంక మద
రం బదిదిక్కులనుండి పొచ్చి బి
ట్టలమియు నవ్వాలంతి నడి
యుఁదక కొఁదలమఁది క్రమ్మఱన్. ౩౪

రాజకుమారుఁడుగా మఱువ
　　　రాని కృషీవలకన్యకా ముఖాం
భోజము నెయ్యపుందలఁపు
　　　పొత్తిళులం బదిలించి యుల్లసద్
వాజి నదల్చె నాత్మపరి
　　　వారము తో నడతేర పశ్చిమా
శా జలరాశిలో నినుఁడు
　　　జారినయంత పురాభియాయియై ! 35

ఇది యంకురము



ఓమ్

# చారుణి

ధౌరితశాధకమ్మును ప్లు
తక్రమకల్పమునైన ధారలోఁ
బాహ్లిక రాజపుత్రకుని
వారువపుం బెడకాలిడొక్కలోఁ
దూరఁబడెన్, మనోజవముతో
టివుటివ్వున మ్రోసికొంచు, హే
షా రభటీవిపాటిత ది
శాఖలపై హయమున్ గుభీలునన్- ౧

లలనయొడం దవుల్కొని వరాకున
నేమఱియున్న రాసుతుం
డులికి పడం ధరం బడఁగ -
నుగ్ర శిలాశకలమ్ముకండు! ముం
దల నిరువంకలన్ బిఱుఁదు
నన్ జనుదెంచు భటాళిగుండియల్
దలరఁగఁ బగ్గముల్ బిగియ
లాగి కటాలున నాఁగి రశ్వముల్ ౨

దారి గండోపలప్రచితమ్ము; బెదరి
యుదుటునంబడ్డ గుఱ్ఱమునుండి పాటు;
జిలుగు బంగరు టంచుల వెలుఁగు పాగ
తెగిన రాహుట్టిలల సుంత వగఁలు. సూపి. 3

చిమ్మనగోవి క్రోల్చి యొగఁ
జిమ్మిన తైవడి వెచ్చవెచ్చ న
స్రిమ్ములు పెద్దపెట్టునఁ దా
అంగిన నంగము లుక్కడక్క మూ
ర్ఛ మ్ముసఁగెఁ గుమారకుఁడు;
సంభ్రమభీవ్రహతప్రవృత్తిఁ గ
ర్జమ్ము తెలిం గెలుంగక స
సాధ్వసనంక్షుభితాంతరంగులై ౪

చీరెలఁ జించువారు, సెగఁ
జిమ్మెడి నెత్తుటి నాఁగువారు, ని
ట్టూరుచువారు, పైఁ బడకుఁ
డో యనువారు, శిరమ్ము నంకముఁ
జేరుచువారు, గాయము స్ప్ర
శించెడువారు, జలమ్ము దెం డటం
చాలుచువారునై యుది యి
దం చెలిగించుచు నంగలార్చుచున్ ౫

కటకటపడిరి దొరల్; నం
కటపడి; రుత్తలపడిరి; కళాపికత్తె రా
రటపడిరి; త్రొక్కటంపడి
రటు నిటుఁ దెగి పఱచి రఱచి రడవి యదుర్వఁగాఁ. ౬

చీర రొంకందు సించి మసి
చేసి యసృగ్ఛిహిరుద్యమమ్మువోఁ
గూఁతియుఁ గట్టుగట్టియును
గొంతియుపాయముచేసి, యావయిక్
జేరువ యోటి నీరములఁ
జేతులతోఁ గొని తెచ్చి మై దిగం
బాఱపు నత్తురుల్ కడిగి
వైచినఁ దజ్జలసేచనమ్ముచే. ౭

వదలెను మూర్ఛయుం; దెలివి
వచ్చి నొకించుక మేని; కంతటన్
గుడుటఁబడిన భటావళికి
గుంపెలు; రాజసుతుం డొకింత క
న్గదిపి; భటాళికిం దెలివి
గాఁచె మొగమ్ములఁ; దన్నుఁ బట్టియు
న్న దొరలఁ గాంచి హాహా మని
నాఁడు కుమారుఁడు; డొనంగి రాదొరల్. ౮

అఱచుకొన్నది తన్నుకొన్నదియుఁ దురగ
మలసి చివరకు మానుకొన్నదియుఁ గూడ;
రాజపుత్రునిఁ దేర్చు సంభ్రమములోన
దాని గతిఁ జూడఁబోఁ డొకండైనఁగాని. ౯

రాసుతు పల్యాణ్గ్రైకొని తు
రంగ మాహాత్మ్యతన పరికార జి
జ్ఞాస వహించి కొంద ఱటు
చయ్యన పర్విడి వామపత్ ఖుర
న్యాస విధావ్యధానుఘట
వ క్షమగండశిలాగులిన్ వెలిం
దీసి రయోసంగినం, గని త
దీయ మహార్ఘవ రేఖ నెంచుచున్ ౧౦

తలఁపున నక్కృపీవల సు
తాముఖ మూదట వచ్చి తాఁకినన్
దలవయి కొత్తి భూమిపతి
నందనుఁ డల్లన జొన్న చేనిపై
నిలిపె శిరోవ్యథా రచిత
నీరస తాలసతా నిమీల ద
క్షుల బలవంతమై యెడఁద
సోఁకిన నూతన మోహవశ్యతన్. ౧౧

వలపటి కరాన నొక వడిసెల ధరించి
గిఱిగిఱిం ద్రిప్పు నా కావు తెఱవ తోఁడ
విలయకాలానఁ జటికన ద్రేలఁ గాల
చక్రియుం ద్రిప్పు నమ్మహాశక్తివోలె. ౧౨

కాంచి బడలిన పెదవి పైఁ గాంతి లేని
మందహాస మ్మొకండు రూపొంద, హర్ష
ఫుల్లవదనుండునై లేవఁబోయి లేవఁ
జాల కొక దార చేతులఁ దూలిపోయె. ౧౩

అస్తమించిన భాస్కరుఁ డావహించి
యరుగ దిగఁబడి దిక్కుల నంటియున్న
గుడ్డి వెలుఁ గట్టులో మోచికొంచుఁ బోయి
పడఁతి చూపులఁ బెట్టె రావట్టి నగవు. ౧౪

ఆజలజాక్షి యా శిథిల
హాసము గన్నది పోల్చుకొన్నది౯
దాఁ జెయిసేతఁ జేసిన య
ధార్థవు నవ్వుల సేత సేత; యా
లే జవరాలి కన్నులు జ్వ
లించెను మేను వడంకెఁ దోన; యా
రాజకుమారుపై నడఁద
రాగిలి రక్తము వెచ్చగిల్లినన్. ౧౫

వడిసెల దవ్వులన్ విసరి
వైచి గుభాలున మంచె దూఁకి రెం
డడుగులలోన లేడివడి
కందని దాటులు వెట్టుకొంచుఁ బ
ర్విడి త్రుటిలోన వ్రాలె పృథి
వీపతి వట్టి పదమ్ములందు బ్రా
న్పడి దొరలెల్లఁజూడఁ దన
వంకకు ఱెప్పలు లేని కన్నులన్. ౧౬

"ఈ తురగమ్ము బాగుళిగ
నేసిన తుంటరి నేన; నేన చే
సేతన దేవరన్ దొరలఁ
జేసితి నేలకు; నొప్పికొంటి; నా
చేఁతకుఁ దగ్గ దండనము
సేయుఁడు; దేవర కెగ్గుసేయు పెన్
బాతకి కేమి దండనము
వట్టును మృత్యు వాకందు తక్కినన్!" ౧౭

అని తెలిగన్నులం దొరఁగు
నశ్రులు చెక్కుల జాలువారి ని
క్కిన చనుదోయిఁ గన్న మొఱ
గించు పయంటపయిన్ లయింప వా

కోన వినఁడాయె నామె కను
గోనలఁ బుట్టిన యశ్రుధారతోఁ
జని చని చన్గనన్ గడవఁ
జాలక తద్గతమైన చూడ్కితో. ౧౮

వెలఁది విలాపముం జెవిని
బెట్టక, త్రిప్పక చూపు నొక్క ది
క్కులకుఁ దదేకచిత్తుఁడయి
కొండొకకాలము పుచ్చె; నంతలో
జిలిబిలి జల్లు చీఁకటులఁ
జిందరవందరచేసి, ప్రాగ్నభః
స్థలి వెలసెన్ సుధామధుర
ధాముఁడు, సోముఁడు, శీఘ్రగామియై. ౧౯

తనకుఁ దానయి పూని కాంతాకపోల
కలితమలినాశ్రుకణములఁ దొలఁచెఁగేలు;
గాఢనంతోష భారగద్గద గళమ్ము
కుంటుపడఁ గాంత కిట్లు రాకొమరుఁ డనియె. ౨౦

"వారువ మీల్గ నేసెఁ దల
పైఁ జెనుగాయము చేసెఁగాక నీ
నేరము; పాయఁజేసె రమ
ణీమణి! నాయెదలో వ్రణమ్ము; ని

ప్రాకరణ నిస్సృతాశ్రీకణ
కందళ సుందరమహాభవన్మణో
హారిముఖేందు దర్శనము
మహౌషధదానము చేతఁ గోమలీ! ౨౧

రాజనందనునకు వెజ్జురాలవైతి;
వీమహౌషధి కేవెల యిచ్చి కొందు?
సురిగిపోయిన ప్రాణాలఁ దిరుగఁదెచ్చి
నిలిపికొంటివే; యీ మేను నీక చెందు. ౨౨

మానితమైన యాత్మమహి
మఙ్ఞ మముఖోంట్లకు మూదలింపఁగా
జేనెదు జొన్న చే నధివ
సించి యదృశ్యతఁ గాంచి కర్మముఙా
దానయి వచ్చి యీ కరణి
దర్శన మిచ్చిన భక్తపాలనా
ధీనమనస్క చారుణికి
దేవి కిదే యుపహార మర్ప్యేదుఙా! ౨౩

శాసిత మానవ కాస్వానిల
చాలనమకా భవదీయరూప రే
ఖాసుఖదర్శనమ్ము కల
కాలము మాకుఁ దొలంగకుండుతఙా!

భాసురనూత్నయౌవన వి
భాసుభగమ్మగు నీ తనూలతా
శాసితమైన నాతనువు
శాశ్వత సౌరభలక్ష్మిం గాంచుతన్ ౧౫

నీవు చితోదురాజ్య రమ
ణీమణివౌదువు, కఠోరసత్వ సం
సేవితమైన యీగహన
సీమకు రాజ్ఞివిగావు, చారుణీ
దేవివి నీవు, నాహృదయ
దీపనశక్తివి మంత్రమూర్తివే!
ఓ విమలాంగి! ఓ త్రిభువ
నోద్వహన ప్రతిభావిలాసినీ! ౧౬

వర్ణమయరసార్ద్రలీల మృదు
భావల నిట్టు లుపన్యసించు రా
ట్తనయు నశిక్షితప్రణయ
దర్శిత గాఢవిలోచనమ్ములన్
గనుఁగొని నేరమిన్ దొనఁగు
గల్గినదానికి వాచికక్షమన్
గనితి; వచోఽనుయావమగు
కార్యమును న్గరుణింతువో ప్రభూ! ౧౭

ఈనెలచందురుం డెటులఁగు;
నీ భవమం దనుభూతపూర్వముల్
గానివి నాకు నీదు మృదుల
స్మితరేఖలవంటి రేఖలుం;
దేనియ లూరు నీ పలుకు
తీరులఁబోలిన పల్కు తీరులు
మానము దుల్పు నీ కనుల
మాదిరి కన్నులు చూపు తెన్నులు. ౨౭

నాయెడ నీయెడం దవుల
నాకయి నీకయి యారటింప నీ
లోయలలోపలం, సెలల
లోపల, జొన్నపొలాలలోపలం
హాయిగ హాయిగాఁ గలిసి
యాడుద మీ తొలినాటి రాతిరిం;
గాయును జందురుండు మన
కై జగమెల్ల వెలందివెన్నెలల్. ౨౮

జెల జెల కొండ నెత్తముల
జాఱెడు నీ సెలయేటి లేఁత పే
చుల చలువల్ వహించి చిఱు
జొన్న పొలమ్ముల కమ్మవయ్యెరల్

పొలసెనయేని నొక్క తుంటి
లోఁ దొలఁగున్ దలదిమ్మత్రళన్నియున్;
దొలఁగును వేఁట చొక్కులును;
దో నరుదెమ్మ పొలమ్మ

పరువునఁ బడ్డ కంకు లొక
పట్టెడు గోసుకవచ్చి దోరగాఁ
జిటుసెగమీఁద వెచ్చగిలఁ
జేసి యొసంగెద నూఁచబియ్యమున్!
గిరి శిఖరమ్మునుండి భువికిన్
దివిజాపగవోలె దూఁకు ని
ర్ఝరిణులలోని స్వచ్ఛమగు
చల్లని నీరముఁ దెచ్చి యిచ్చెదన్. ౩౦

ఊఁచ బియ్యమ్ము పొట్టవో నూఁదుకొంచు
నారగింతువు చవుల నోరూర; నేటి
నీరు కడుపారఁ గ్రోలి తేన్చెదవుగాని
విందొసంగెద మా మంచె క్రింద నీకు." ౩౧

రమ్మని రాకుమారుని క
రమ్ముఁ గరమ్మునఁ బట్టి లాగినన్
గిమ్మనలేక లేవ గను
కొందిన పంచు గ్రహించి లేమ పూ

స్త్రమ్ముకఁ దూఁత యాఁగోని ము
దమ్మున లేచి పాలమ్ముదిక్కు మా
ర్గమ్మున నమ్మృగేక్షణ క
రమ్ము భుజమ్మును నూఁతగాఁ జనెన్. 32

తన్మృపతి పట్టి యాజ్ఞ శిర
సా వహియించి పురాభిముఖ్య యా
త్రాపరులై గమించిరి దా
రల్ తెలవాఱకమున్న వల్లకీ
తో పునరాగమించి తముఁ
దోడ్కొనిపో నియమింపఁ బడ్డ వా
రై పరుషోపలోపరి ఖు
రాపతనారటదశ్వయానులై. 33

అలన లఘు ప్రయాణముల
నల్లన నల్లనఁ గాలిబాట న
చ్చెలువయు రాకుమారుఁడును
జేరిరి కొండొకసేపు లోన న
ప్పొలమును; గ్రొత్త దంపతుల
పోడుములన్ బొడసూపు వారిపైఁ
గలకల నవ్వె నాఁ గలువ
కన్నెలరాయఁడు గాసె వెన్నెలల్. 34

ఇది దీపనము

# వారుణి

తావియుఁ గడానియుం గూడఁ దారినట్లు
కళయు శాస్త్రమ్ము నొక్కచోఁ గదిసినట్లు
ప్రకృతియున్ గవియున్ జేరవచ్చినట్లు
పొలిచె నాజంట పొంక మపూర్వ మగుచు. ౧

ఒరులు తన్నని యుబ్బుట యెఱుఁగుగాని
ఒరులఁగని యెన్నఁడే నుబ్బి యెఱుఁగనట్టి
చెందొవలరాయఁ డా మంచు క్రిందిరేత
ప్రియులఁ గన్గొని యుబ్బి తబ్బిబ్బులయ్యె. ౨

కాఱుమేఘాల కొండల కడల కెగసి
నీలిమేఘాల లోయలఁ గూలుకొనుచు
నుఱుఁగు దబ్బలు సెలవుల నుఱల నుఱికి
వచ్చెఁ జందురుఁ డీ వైభవమ్ముఁ జూడ. ౩

కలువరాయుండ యీ కన్నెఁ గన్నవాఁడొ!
ఔర! యిరువుర కొక్క రూపయ్యె నౌను!
వావి వరుసల నరణి రావట్టె నిపుడు
మామయై చందురుఁడు చందమామ యయ్యె. ౪

సుంకు పొలివోని లేజొన్న కంకులేటి
త్రెంచుకొని వచ్చి తలగడదిగ్రిందు గూర్చి
పొరలు విరియని వెన్నాకు పొత్తు లేటి
తెలిన మంచియ క్రింద సేర్పఱిచె సెజ్జ. ౫

రాజపుత్త్రుండు నాజవరాలి కేలం
నూఁతగా మేను సెజ్జపై నొయ్యఁజేర్చి
నరుణ పల్లవ కోమలమైన తరుణి
తనులతా మార్దవమ్ములఁ దలఁచుకొనుచు. ౬

పొట్టు వో నూఁది కాంకాకపోలరుచుల
నందగించిన యూఁచబియ్యము భుజించి:
పక్వఫల బింబవల్లి సంపర్కముననొ
చెలియ ! యివి యింత తీయనై వలచె ననుచు. ౭

రమణి బింబాధరామృతరసము గ్రోల
నిచ్చగతి నెఱ్ఱనైన దోయింటఁ బట్టి
యేటి తీయని జలము లందీయఁ ద్రావ
నలరుదొన్నలఁ దేనియ లలియుఁబోలె ! ౮

ఊఁచబియ్యము దని యేటి యుదక మాని
వికలితమ్మగు మేను తేరుకొనెఁ గాని
క్షణవిలంబాసహమ్మగు మనసు మాత్ర
మ్మధింత తృష్ణాభరమ్మున నారటించె. ౯

శీతలానిల వీచికా సేవనమున
బడలికలు దీర మై చల్లఁబడియెఁ గాని
మన్మథానల పాణింధమమ్ము హృదయ
మునకి యతఃతృష్ణదీర ఘనా నూర్పు వుచ్చె. ౧౦

మంజుల స్వీయ రాగరక్తాంజలిపుట
దత్త గిరిశిరశ్శరాఁబువ్రల్ తా౯వి, యమృత
పాఁణోదాత్తతేజుఁడౌ భాను వోలె
నలరు రాపట్టి నతవదనాంచలమ్ము. ౧౧

జ్ఞాతలజ్జావిలాసముల్ గాని కనుల
వలపు గదిరిన కోరచూపుల, వెలంది
యూచి లక్షించెఁ దలఁపు వేఱైన యెడఁద
నభినవోద్రేకవికృతి బిట్టలముకొనఁగ. ౧౨

నరయువిస్మర భావనోమ్మలతఁ గరఁగి
తొలఁగు హృదయమ్ము వోలెఁ గందోవల నురలి
దొరలె కోష్ణాశ్రువారి బిందువులు రెండు
ధరణిపతి పట్టి చరణ పంకరుహాసీమ. ౧౩

పరిశమ వర్షాంబు బిందు సంపాతజాత
నూతనాశా వియచ్చరచ్చాతకముల
కరణి జీవ్వన నగిరి యుక్కలికి కనుల
మునరుకొన రాజపుత్త్రు దృగ్వినరములును. ౧౪

కలుకు గుబ్బలలో దాఁగికొనెనో యేమొ
యింతకాలమ్ము ననుసిగ్గు దొంతరలయి
ముంచుకొని వచ్చెఁ గాంతకుఁ గంచుకమ్ము
కరణిఁ బులకల పేరింటఁ గాయమెల్ల. ౧౫

సాధుహృదయ విభేదన క్షమము లఁవిద
వాఁడి చూపులు బేలలై యెండిపోవె
పతన మాత్ర హృతద్విషత్ ప్రాణములగు
రాజనందను దృక్ఛరప్రతతి యెదిరి. ౧౬

మారు బాణమ్ములన్న నామమ్మె కాని
కలికి చూపులు పూవుగుత్తులు నిజమ్ము!
పూవు లెడఁదలఁ జీల్చి పోవుటయె కాని
మగల చూపుల కటకు లేమలకుఁ గలదె? ౧౭

ముదిత చిన్నారి సిగ్గులో మున్కఁ గాంచి
నిలువు నిలువునఁ బుల్కరించినది గాంచి
వడఁతిఁ దమకంపుఁ గౌఁగిటఁ బట్టె నతఁడు
పురుషు లిందుల సాహస పరులుగారె! ౧౮

తొలుత నెడఁదలఁ బుట్టి చూపులకుఁ బ్రాఁకి
పలుకులకు వచ్చి తుదకుఁ జేఁతలకుఁ జొచ్చు!
వలపువంటి విచిత్రమౌ వస్తువొకఁడు
గలదె యోజింప మూఁడు లోకములయందు? ౧౯

చదివిన శాస్త్ర పాఠములు
చక్కిలిగింతలు వచ్చి మాటికిన్
బదనగుచున్న నాత్మరతి
భావము ప్రేరణఁజేసి మూఢుఁడై
యదుము నురమ్ముతో నురము;
హత్తుఁ గపోలముతోఁ గపోలమున్;
బొదువు మెయిన్ మెయిన్; దళిరుఁ
బోఁడి కళాస్థలముల్ చుఱుక్కనన్. ౨౦

మాటికిఁ గాఁడిపో నడఁద
చూడఁగ నేరిపె; రాగసూచి యా
మాటకు మోహవాచి యగు
మాటయు నేరిపె, ఊమ్మ విచ్చిపో
గాటపుఁ గౌఁగిలింతలకు
గాటపుఁ గౌఁగిలి నేర్పెఁ; గాము న
య్యాటకుఁ దత్తరించు తన
యాటల నేరుపు నేర్పె లీలమై! ౨౧

రాసుతుఁడన్న గౌరవ భ
రమ్మున నొండె; శిరోవ్యథా పరి
శ్రాంతుఁడన్న యాదర భరమ్మున
నొండెః కృతజ్ఞతాత్త వి

శ్వానముచేత నొందెఁ; బల
వన్మద నోద్ధతి విక్రమించు నా
రాసుతు కాముక క్రియల
రావున రాగిలె బాల బేలమై! ౨౨

ఆ చెలువుండు నా చెలియ
నా తొలినాఁటి సమాగమంబునం
దే చెయిదమ్ములన్ మసలి
రింతయుఁ బూచిన చప్పరమ్ములున్
వీచిన తెమ్మెరల్ వినిన
వెన్నెల పుల్గులు నిండు వెన్నెలల్
గాచిన చందురుండు నెటుఁ
గన్వలె వారి వచింపఁగా వలెన్. ౨౩

విరిసిన పూవుఁజప్పరపు
వీథులఁ దేటులయందు ఁదేటులై
మొరసిన యేటి తేఁదరగ
ముత్తములన్ జిఱుమీల మీనులై
కురిసిన పండువెన్నెలఁ జ
కోరపు జంటలఁ బుల్గుజంటలై
మురిసిన తీవఁజొంపములఁ
బూచిన పూవును గమ్మ తావినై. ౨౪

అతిమనోహరమైన యా నిందు రేయి
బ్రతుకు భోగించి సార్థకము గావించి
తమిమీర నడవియంతటఁ ద్రిమ్మరిల్లి
రమియించి రిచ్ఛాపరాధీను లగుచు. ౨౫

అల పగలింటి వేఁటకత
    నా బలితమ్మగు మేనిచొక్కు, బో
దలఁ బెడిదంపుగాయము క
    తమ్మగు పెన్వగయున్ రవంతయుం
దలఁపఁడ, కామినీమృదు సు
    ధామధురాధర మాధురీ నిరా
కులుఁడయి, తన్మనోజ్ఞసుమ
    కోమలగంధ వపుశ్శయానుఁడై! ౨౬

పొగరున నిర్వరున్ వలపు
    పొంగులు దీఱెడుదాఁక నీగతిన్
పగవుఁ దలంప కిష్టరతి
    భంగుల సంగతిఁ బిచ్చలించుచున్
బిగువు కవుంగిలింతల, ని
    పీడిత కౌసుమరేఖ నెంతయున్
సొగసిన మేనులందు రతి
    చొక్కులు దీరఁగ నిద్రఁ గూరిసన్. ౨౭

* * *

బారులుగట్టి పక్షులు న
భఃస్థలి నీడపథమ్ము పట్టి, నం
భారవఘూర్ణితమ్ములు గ
వార్భకముల్ నిజకోష్ఠమార్గ నం
చారము పట్టి, పశ్చిమ ది
శాజలరాశి మునింగె భానుఁడున్,
చారుణి యింటిదిక్కయిన
జాడలు కానఁగరావ యింతకున్. ౨౮

దూరపుఁ జేలనుండి రహి
తుల్ తమయిండులఁ జేరుచుండ్రి, నం
ధ్యారుణరోచులం దుదయ
మైన తమస్సు సుధాంశురేఖలోఁ
గూరుకుపోయె, దీపముల
కున్ కళ వెల్వలఁబారె; నింతకున్
చారుణి వచ్చుజాడ యయి
నం గనుపింపద చూపుమేరలో. ౨౯

నేరిపిపుచ్చినట్లు ప్రతి
నిత్యము చారుణితోడఁ బల్లియన్
జేరెడి యేటి తెమ్మెరలు
నేఁ డిటుదక్కిన రావు! కానలోఁ

జేరి యెవే న్వినోదములఁ
        జిక్కిరో ! అక్కట ! ప్రొద్దుపోయెడిన్;
చారణి వచ్చు జాడయుయి
        నం గనుపట్టఁగఁబోద యింతకున్. ౩౦

మాపు నగమ్ము పైఁ గడచె
        మాటు మణంగెను వల్లె; చారణీ
గోపుర దీపికాద్యుతులు
        కూరుకఁజొచ్చెఁ గ్రమ క్రమమ్ముగా;
నీ వసిపిల్ల యించుకయు
        నేని నెఱుంగదు మంచిచెట్టు; తా
నే పులిపిల్లతోడ రమి
        యించుచు నున్నదో కానలోపలన్? ౩౧

నీ తెలివినవ్వు చాయఁ బుర
        ణించెడు తీయని నవ్వుదాని, నీ
శీతమయూఖ రేఖకల
        చెల్వము విల్చిన చూపుదాని, నా
పాత జగచ్ఛ్రవశ్శుభగ
        వాక్కుల చక్కని చిన్నదాని, మా
కూఁతు వనమ్ములోనఁ గనుఁ
        గోవుగదా యొటనేనిఁ జంద్రుఁడా! ౩౨

బారెడు చింకి చీర నగ
పాలు మొలంగు పదాగు వన్నె బం
గారపుఁ జాయలన్ వెలుఁగు
కమ్మని యంగముతో నిసర్గ శృం
గారము దాని, మేలి నడ
కల్ గులికించెడు చిన్నదాని, మా
చారుణి! దాని జాడలను
జందురుఁడా! కనుఁగొన్ గా వనిన్. 33

దూరపుఁ గొండ చెంగట న
దో చిఱుకానకు నాల తట్టుగాఁ
బారెడు నేటిగట్టున న
వర్తక సేనియుఁ జూడఁబోవుగా?
చారుణి మాడువట్టె యది
చందురుఁడా! యని మింటివిక్కు ని
ట్టూరుచు చుస్సు రుస్సురను
చంద్రిక సుతాగత చిత్రవృత్తులై. 3౪

కానక కన్న బిడ్డయది:
కావున నాముది యాల్మగళ్ళకున్
ప్రాణము ప్రాణమై నయన
పర్వ మొనర్చెడు నొంటి కూఁతు ర

శోకానల నొంటిపాటున మె
    కమ్మలఁ జిక్కెనో? కాక యేమిచ్చెం
దాన వెతన్ దవుల్కొనెనో
    దైవమ! యన్ వలవంత హెచ్చినన్......౩౫

ఎడఁద తమాతమాచేతఁ దల్లడపడంగఁ
దడవు సైపఁగ రాక చిత్తము కలంగఁ
గర్జమెఱుఁగక కాళ్ళు తొట్రుకొట పడంగ
నిలువఁజాలక యా దంపతులు కడంక!    ౩౬

పరిచితమైన లోయఁ బడి
    భావమునన్ వెనుబాటొకింత యే
సెఱుఁగక యెల్గు కొట్టకొన
    నిర్వ్యరు చారుణి! చారుణీ! యటం
చఱచుచుఁ జేనిదిక్కు మొగ
    మై పరువెత్తిరి తల్లి దండ్రియుల్
జెరి రయిక ప్రక్కగఁ బయిరు
    చేల నలంగిన కాలిబాటలన్.    ౩౭

చారుణి! చారుణీ! యను వి
    షాదవిదారిత కంఠరావముల్
మాఱయి మాఱునై చఱియ
    లన్ మొఱయన్, దరురుద్ధ చంద్రమ

శ్చ్వరము, భీకరాంధ తమ
　　సంబయి, యేకసుతావియోగచిం
తా రచితాంధకార భరి
　　తంబగు స్వాంతము వోలె సెంతయున్. ౩౮

దారుణదర్శనమ్మయి ని
　　తాంతభయప్రదమౌ కిశోరకాం
తారము జొచ్చి యా ముసలి
　　దంపతు లాత్మసుతా గవేషణ
ప్రేరిత సత్వులై పరుగు
　　వెట్టిరి కాలికొలందియౌ వడిం
జారియుఁ దెన్ను గాక, బహు
　　ధా విచలన్నిజచిత్తముం బలెన్. ౩౯

ప్రణయగంధకఠోర పారావతములు
కలఁతనిద్దురఁ గూజించు పలుకులు విని
చారణీ! యను శ్రుతికాస్వర విశంక
నొక్కెడెన తండ్రి, వేఱొకచక్కి తల్లి. ౪౦

చారణీ! యను తండ్రి యుచ్చైఃస్వరములు
చారణీ! యను తల్లి యుచ్చైఃస్వరములు
నడిమిత్రోవ నొండొంట లీనమ్ము లగుచుఁ
దోరణమ్ములు గట్టెఁ గాంతారమెల్ల. ౪౧

అట నట వ్యాఘ్రపర్వత గు
హాకుహరోదర నిద్రితోత్థితో
ద్భట హరిపుండరీక కిటి
భల్లుకజృంభణ వాయువీచికా
పటలములందు స్వఃకుసుమ
వాసితమౌ స్వసుతా వపుర్లతా
స్ఫుట మృదుగంధ చిహ్నములం
బోకునో యట విచికిత్స నాఁగుచున్. ४२

క్రిక్కిఱిసి యున్న వృక్షశాఖికల నడుమఁ
దొంగిచూచెడు నిందు చందురునిఁ గాంచి
చారుణీ! యని పిల్తు దుచ్చైఃస్వరమున
నందినీ ముఖబింబ శంకానిరూఢి. ४३

ఏక సుతాగతాత్మ లయి
యీగతి వస్తువివేక శూన్యలై
తాఁకిన తీవలన్నియు సు
తా మృదుదేహములంచు నాసికన్
సోకిన గంధ మేదియుఁ ద
నూజతనూద్గత మంచు, వీనులన్
బ్రాఁకిన యెల్ల కంఠములు
నందిని కంఠములంచు నెంచుచున్. ४४

ఎట్టకేలకుఁ దమ చేనిగట్టు చేరి
రవలితట్టునఁ దండ్రియు నివలఁ దల్లి;
ఆ ప్రశాంత నిశాగర్భ మద్రువ నడరు
చారుణీ! యాను భగ్న కంఠారవముల. ౭౫

రాజకీర మొక్కకందు కోద్రంగ శిఖర
మధివసించినయది; కేక లాలకించి
పారిపోవదువో! పరిపక్వ సస్య
మాధురీ మోహమున మేను మఱచిపోయి. ౭౬

ఇది యనుభావము



# చారుణి

"ఓసి కఠోర! యీ మృగత
ృష్ణాగ్రివనమ్ముల నొంటి నిట్లు రా
కాసియుంబోలె జేల నిలఁ
గాఁ బని యేమిట వచ్చెఁ? బిచ్చి న
న్నాశ్రయిసివిగాని లోఁదలఁప
వైరివి కానల నేమొ యంచు నీ
కోసము మేము తల్లడిలు
కొందుము డెందములం దటంచునున్. ౧

మంచి చెడ్డల నెఱుకఱు మచ్చు, పెక్కు
గతుల కడగండ్ల పాలింటి కారణమ్ము
సాహసమ్మున కిక్కయౌ జవ్వనంపు
మదమునకుఁ దగ్గ పనియె చేసెదవు సుమ్ము! ౨

రేయి సాము గతించె నూరిజన మెల్ల
నిద్రలో మున్గిపోయెఁ గాని గృహమ్ము
పట్టవైతివి; యేమి సంపదలు దాచి
పెట్టుకొంటివో చేనిలో వెఱ్ఱితల్లి. 3

పండినచేను తుంటరుల
 పాలగునోయని పెట్టి తల్లి! యీ
గండరి బెబ్బులుల్ దిరుగు
 కాననసీమ నిశీథి నొంటి గా
వుండెదవో జగాన రసపుత్తు)ల
 రాచతికంబు సెల్లుచో
గుండెలు లేవు తుంటరులకున్
 పయభిన్న పథానుచింతనన్" ౪

అని యనురాగాతిశయం
బునఁ దనయామ్ప్రదుల దేహమును గాఁగింటఁ
గొని తడవుచుఁ బరవశులై
మునిఁగిరి తలిదండ్రులతుల మోదాంబుధిలో. ౫

ఆదట నిర్వ్యాత్మ తన
యా నుకుమార తనూపగూహానా
హ్లాద విధా విముక్త బహి
 రంతర కుత్సిత భేదభావులై
ఖేదము డిగ్గఁ గొండొక ను
 అంచిరి శాంత మనో వికారులై
గాదిలి పట్టి నెమ్మొగము
 కమ్మనిగంధము లారగించుచున్. ౬

సుఖపరీరంభణములకుఁ జోరదు; ఘ్రాణ
తృష్ణ దీరంగ మూర్కొననీదు మూర్ధ;
మిగ్గ మూర్కొనఁబోఁ గౌఁగిలింపఁబోవఁ
గుంచుకొనిపోవుఁ బోవు తప్పించుకొనఁగ. ౭

పరుగు పరుగున వచ్చి 'అప్పా' యటంచుఁ
దనపయింబడి ముద్దులఁ దనుపు బిడ్డ
మొఱఁగఁ దమకించు సిగ్గరి తెఱఁగు గాంచి
కన్నతండ్రికి వెఱఁగు శంకయు జనించె. ౮

చిరిగిన బింకమున్ చెదరి
చిందర వందరమైన ముంగురుల్
విరిసిన పోకయున్ సరసి
పీఁగెడు కన్నెతనంపు గుబ్బలున్
సురిగిన మోవి కెంపు నగు
సుందరి చందము గన్నతల్లి బి
త్తరి యనుభూత నూత్న సుర
త స్థితి పోల్చుకొనెన్ క్షణమ్ములో. ౯

కూఁతు చిబుకమ్ము వట్టి, చెక్కులు స్పృశించి
కొంతవడి కట్టులో పోల్చుకొనియె తండ్రి;
పట్టి మెడఁబట్టి చేనిలోపలికి గెంటి
హుంకరించుచు మంచియవంక కటికె. ౧౦

అనియత నూత్నయౌవన మ
దాతిశయంబునఁ గ్రిందుమీఁదుఁ జూ
డని తమకంపుఁ గూటముల
డస్సి, కుమారసమీర వీచికా
గణముల సేవ పైఁ మఱచి
గాఢసుషుప్తి నిమగ్నుఁడైన రా
ట్తనయుని గాంచి క్రోధభయ
దంబగు నాకృతి దాల్చి యుగ్రుఁడై. ౧౧

సన్నిహిత మృత్యుదేవతా చ్ఛాయఁ దవిలి
సడలిపోయిన జరఠాంగసంధు లదలఁ
జేతికందిన రొంక గండశిలఁ గుమారు
తలఁ బగుల వేయఁబోవ నక్కలికి యులికి- ౧౨

డాయఁగఁబోయి "యక్కట
టా! యిది యేమి మహాపరాధ ? మ
హ్హా! యిది రాజు; రాజవధ
మా యొనరింతువె మాను" మంచు క్రో
ధాయతమూర్తియౌ జనకు
నడ్డపడెన్ హృదయప్రియావనా
మేయ భయాతిరేకమున
మేలొని యుత్థితరోమరాజియై. ౧౩

రాజశబ్దమ్ము విన్నమాత్రమున వృద్ధు
చెదరిపోనున్న రోషమ్ము చిక్కఁబట్టి
భయము, పరిభూతి, రుష, జుగుప్సయుఁ బెనంగి
కరడుగట్టిన యీర్ష్యావికారభంగి. ౧౪

కటము లదర, నిటలతటి చెమర్చగ, రద
చ్ఛదము వెటిలిపడఁగ, రదనపటలి
పటపటన్ రటింపఁ గుటిలమా భ్రూకుటి
చిటులఁ గటుఘనారభటుల ననియె:— ౧౫

"అన్నముఁ బున్నెముం దెలియ
నట్టి యమాయికబాల యచ్చపున్
గన్నెఱికంబు, జవ్వనపుఁ
గావరమున్ సిరి కావరమ్మునన్
గన్నులకెక్కి రాఁ జెఱుపఁ
గాఁ దమకించిన దొంగ వీవు, నీ
కన్నులఁ బడ్డ బిడ్డలకుఁ
గన్నెఱికమ్ములు దక్కవో యిఁకన్? ౧౬

రాజులు లేరె యెవ్వరు ధ
రాస్థలి? నెల్లరు వివిధమ్మునన్
లేజవరాండ్ర జవ్వనపు
లిబ్బులు గొల్లలు వెటు నంతకే

రాజులనమ్మ నేయుదురొ?
　　రాజులకున్ స్వవరాంగనాభిదా
యోజన చెల్లదొక్కొ? సిరి
　　యొల్లదొకో నదనద్వివేకమున్. ౧౭

భూజనముల్ సుఖించు వెర
　　వుల్ కలిగించెదు నంతమాత్రకున్
రాజవు కాక, యీ విధమునన్
　　దలిదండ్రుల యాన లేక క
న్యాజనపాళి నిమ్ములుప
　　యౌవనలక్ష్ములఁ గొల్లలాడఁగా
రాజులనమ్మ లేటికి భ
　　రంబగు మోహమదంబు చాలదో? ౧౮

నవనవలాడుచున్ దినది
　　న ప్రచురమ్మగుచున్న క్షేత్రమున్
దవిలి కలంచినాఁడవు గ
　　దా! యదయాత్ముఁడ! యొడ్డు నేరమున్
దవిలిన శిక్ష సేయఁగల
　　ధర్మకులంబునఁ బుట్టి నీవ యి
ట్లవగడ మాచరింపఁ, గల
　　రా నినుఁ గాదనువార లెవ్వరున్? ౧౯

నీవని యింత తాలిమి గ
నించితిఁగాని మఱొక్కఁడైనచోఁ
బోవఁగలాఁడె నాశనముఁ
బొందక చందనవంశజాత కీ
రేవఁ బరాభవ మ్మనుభ
వించియు రాజసుతుండ విట్టి నీ
కీవిధి దాపురించె నొకొ
హేయపు దుర్వ్యసన ప్రసంగముల్ ? ౨౦

రాచబిడ్డవు పాపమార్గ ప్రచారి
జనములకుఁ దత్తదర్హ శిక్షావిధాన
చణుఁడ వీ ద్రోహ్యమునకు శిక్షావిధమ్ము
నుదువుకొను మీవ;యనుభవింతువు స్వయమ్ము.౨౧

వెఱపు తెలిచించుకొని వెలి కుటికి వచ్చు
దారుణ క్రోధ నిష్ఠుర ధర్మఫణితి
నుఱిమె వృద్ధుండు శిథిల పయోద రటిత
భగ్న గర్జా కఠోర వాక్యంగి చెలఁగ. ౨౨

జ్ఞాపిత నైజ పాపకర
ణ స్థితిమై తనుఁ దానెఱింగి యా
భూపకుమారుఁ డమ్మదుక
ముంగిట నంజలి పట్టి నిల్చి వి

జ్ఞాపన చేసె; "చేసినది
సత్యము; పుణ్యమొ పాపమో! భవ
చ్ఛాపము స్వీకరించుటకుఁ
జాలెద ధర్మ వినీత వృత్తిమై! ౨౩

పాపమో పుణ్యమో చేసి వార్ధకమునఁ
గఁలత వెట్టితి మీ ముదుసలి యెడంద;
నానతిత్తురుగాక దయాప్రసన్న
భావమున నర్హమైన రక్షావిధమ్ము." ౨౪

అని వినయంపుఁ జందమున
నాడెడు రాజకుమారు మాటకున్
మనమున నబ్బురమ్ము వొడ
మఁగ జకితుండయి తేరిపారఁ గ
న్గొని యనుతాప భుగ్నమగు
కుంఠిత కంఠముతోడ రాజనం
దను దెస చూడ్కి కూఁతువద
నంబు దెసన్ మరలించి జాలిగా. ౨౫

"వాడని ప్రేముడిఁగ బ్రతుకు
వందువుగా మనసొగ్గి పెంచుకొ
న్నాఁడను దీని నిందనుక
నందనుపోలిక; నాఁడుపుట్టువుం

బోదుము లుబ్బనీక, మగ
పుర్వుల యంటులు సోకనీక; కా
పాడితి నాదు మన్కి గడపన్
గడచూ నను గంపెడాసతో. ౨౬

ఆశ సమస్తమున్ విఫల
మయ్యెగదా భవదీయతామసా
వేశవశాన; మా బ్రతుకు
వెల్గు హరించితి వామపో; త్వదా
పోశితముక్తమైన బ్రతువున్
దలపై నిడి దీని కేమి సం
దేశ మొసంగ నెంచితో కదే
మదనానలదగ్ధ శీలకున్. ౨౭

పూతకుశాగ్ర సంస్కృత; మ
పూర్వమనోహర రంగవల్లికో
పేతము, సుప్తపావక ని
వేశితకావ్యము, చారుణీతనూ
నూతనయజ్ఞకుండిక మ
నోభవకేల రగిల్చి హోత వు
ద్గాతవు నీవయై తొలుత
గా నొనరించితి కామహోమమున్. ౨౮

ఈ యజ్ఞకుండిక కీవ నాథుఁడవు;
ఈయజ్ఞఫలమున కీవ బాధ్యుఁడవు;
అజ్ఞానకృతమైన యపరాధమునకు
ధర్మసమ్మతమైన దండన మ్మిదియ."

అవి నునుమంచు గుంపులో !
అహో! నన తేనియ సోనవంపులో !
అవి యమృతంపు ముంపులో !
అహో! తనువెల్లఁ గ్రమ్మింప రాట్తనూ
భవుఁ డవశాంగుఁడై యవశ
భావుఁడునై యవశాత్ముఁడై యసం
భవ పరిణామ మూఢ తను
భావత నప్రతిభుండునై చనెన్. ౩౦

తునియు నాశాలతాక పొత్తున లగించు
సున్నితమ్మగు విధిచేతి సుత్తిదెబ్బ!
శాప భీ లతికా చ్ఛేదనోపకారి
కారుణికమైన విధిచేతి కత్తిదెబ్బ! ౩౧

"పరిణతమైన నిండుటెదఁ
బండినవంట, నిసర్గరాగ సుం
దర కృత క్రథామృదుల
దారుణ, ముజ్జ్వల మంగళాశిషా

చరణము నైన మీ మధుర
  శాపము ధర్మపథానువర్తినై
శిరమునఁ దాల్చి మీ పనుపు
  చేసెదఁ బాసెద దోషలేశముల్. ౩౨

కలుష మెఱుఁగని యుక్రమక్రమము నాది;
కటుత మెఱుఁగని న్యాయమార్గమ్ము మీది;
సకల పురుషార్థ సాధన చతురరీతి
రమ్య మీ ధర్మ ముభయతారకము సుమ్ము. ౩౩

ముచ్చిలిన సొత్తు ముచ్చుకే యిచ్చి మెచ్చి
కాన్క వెట్టెను నీ నయగారి తనము
మూఁడు కాలములందు నీ రేఁడు జగము
లందు వినఁగందుమొకో! కనఁగందుమొక్కొ! ౩౪

మినమినలాడు చేనఁబడి
  మేసిన దుర్మద పుంగవమ్ముకై
పనమయినప్డు మీఁదఁబడి
  బాదక మూఁపున దట్టి, యీసునన్
గసరక గంగడోల్ మృదువు
  గా స్పృశియించుచు లేఁత పత్త్రికల్
మెసవ నొసంగు నీతికి
  నమింపఁగ రాదె నృపాల కోటికిన్! ౩౫

లోలుప దృష్టులన్ బెరటి
లోని రసాలమహీజ శాఖలన్
వ్రేలెడు పండ్లపై మరులు
పెట్టుక నఖ్ఖులు సాచు తుంటరిన్
గేలనొ శాలనో యడచి
గెంటుట లోకమురీతి; యిట్లు నా
బాలిశు వంట రుష్య నయ
పద్ధతి నయ్యెడ నేర్చితో కజే! 31

పక్షిరాజ చంచూపుట భ్రష్టమగుచు
నమృత పాథోధిఁ బడ్డ మత్స్యమ్ము భంగి
మృదుల భవదీయ శాపోక్తిఁ బ్రిదిలి పడితి
చారుణీ ప్రేమ పీయూష సాగరమున. 32

ఇది యాశాసనము



ఓమ్

# చారుణి

ఆగతి రేయియంతయు ర
సార్ద్రి మొనర్చిన చందమామ యు
స్తాగ శిఖావలంబి యయి
యవ్వల డిగ్గఁడు నూత్న దంపతీ
రాగమునన్ ఫలాగమ మ
హోత్సవ దర్శన కాంతిఁజేసి సూ
ర్యాగతిపైఁ గనుంగవ, ప్రి
యద్వయిపై నెదయై ద్రవించుచున్. ౧

కరగిన కాయమై సోనలు
గా స్రవియించు నెడందయై సుధా
కరుఁడు తుషారమై యలమి
కౌఁగిటఁ గ్రుచ్చెను నూత్న దంపతిన్;
పరిధి లతావశిష్ట పరి
పాండుర బింబముతోడ చారుణీ
పరిణయ దర్శనోత్సుకతఁ
బాయఁడు పశ్చిమ శైల శృంగమున్. ౨

తెలతెలవారెఁ దూరుపు; న
దించె దిశాంచలముల్ వియచ్చరత్
కిలకిలనాద మేదుర శు
కీ శుకముల్; మసృణారుణాంశులన్
గలకలలాడెఁ బుష్కరగ ము
ఖమ్ము నవోన్మిషితాబ్జ మట్లు; ది
గ్వలయము స్వర్ణకంకణము
జైవడిఁ జుట్టెఁ బొంగమ్ము చుట్టుచున్. ౩

పూర్వ దిక్కామినీ ఫాలమున వెలుంగు
నార్ద్ర కాశ్మీర లేపమ్ము నట్లు; సహస్ర
కిరణు రథ కేత నారుణాంబరము నట్లు
పశ్చిమాహీధ్రమ్ము కొన నుషోబాల తోఁచె. ౪

ఆ యుషోరుణ దీధితులందుఁ గలసి
సవితృపీతాంశువులు దిశాసమితిఁ బ్రాఁకి
నాకసం బెల్ల వెల్గుల ప్రోఁకయయ్యెఁ
బసపు కుంకుమ మయమయ్యె వసుధయెల్ల. ౫

గాఢతరసుప్తియోగ మగ్నమ్ము జగము
ఫలిపిన తపఃఫలంబన సప్త సప్తి
తరుణరాగ ప్రసన్న సుందర ముఖమ్ము
పొడుపుమల కొమ్మనందు సొంపులు వహించె. ౬

ఆ దిననాథబింబ మది
సావయవంబయి డిగ్గి వచ్చెనో!
వేదము లాకృతించిన ప
విత్ర మహోమయమూర్తి; రోహితా
చ్ఛాదన బ్రహ్మతేజము; వి
శాలలలాటతటీ విభూతి రే
ఖాదృత శైవ తేజ మసి
తాంగిక వైష్ణవ తేజ మొక్కఁడై. ౭

వ్యాఘ్రగిరి శిఖరమ్ము సింహాసనముగ
రాజపుత్ర ప్రపంచ సామ్రాజ్యమేలు
చారణీమందిరమునఁ బూజారి యతఁడు
మూఁడుమూర్తుల ధర్మమ్ము మూర్తి యతఁడు. ౮

చారణీదేవి ప్రాతరర్చావిధాన
భావనాసక్తిఁ జను వాని పాదభూమి
మూర్ధములు రెండు నొగి నేకముఖములగుచు
నొరిగె మల్లీ ప్రసూనమంజరియుఁ బోలె. ౯

గళితసమాధి బంధము, వి
కస్వర జాగృతియా వవస్థలోఁ
బలికిన దివ్యవాణి శ్రుతి
వాక్యము సైఫలియించుఁగాక! "వ

ర్ధిలవలె వంశవర్ధన ధు
రీణము సంతతి" యంచు దివ్యమం
గళకలమంజు లాశిషము
కల్పితమయ్యె ద్విజన్మవాణిచే. ౧౦

పాదరజమ్ము మస్తకము
పై ధరియించి తదీయశేష మ
త్యాదృతిగాండ్ల నద్దుకొని
హస్తయుగమ్ము హృదంతికమ్మునం
బాదొనరించి వ్యాఘ్రగిరి
మస్తముతో నిజనాసికాగ్రమే
కోదరమైన రేఖవయి
నూఁది మిథో మననాభిలగ్నమౌ ౧౧

దేశికు దివ్యదృష్టివయి
దృష్టి లగించి లగన్మనోరథా
ధ్యాసిత జీవితాశయులు,
ధ్యానమిళద్విమలాత్మ లోక నం
ధా శివభావి మంగళ క
థాలయి తాసులు, నైన దంపతిన్
శ్వాసిత శార్వరీశకల
భాసనుఁ డానతి యిచ్చె నీగతిగా. ౧౨

“జలధిగభీర మీ నృపతి
చంద్రుని రూపు, ముద్రగపావకా
చల సదృశమ్ము నీతనువు
చారుణి! మీయుగళమ్ము యోగ మా
జల మనలమ్ము యోగమగు
చందము సూ! జలమ్ముఁ జ్వాలన్మహా
నలము హరించు; నట్టి జ్వాల
నమ్ము హరించు జలమ్ము పిమ్మటన్.” ౧౩

శాంతగంభీరమౌ సుధాసాగరమ్ము
ఘోరబడబాగ్నితోఁ గాలకూట విషము
నుడిసెఁ; బులకితగాత్రులై యుదరి కనుల
గలిపి రుభయులు; కంఠముల్ గలిసె నవియొ! ౧౪

“కలసెఁ గన్నులు మనసులు గలసె నంతఁ
గలసె నెడఁదలు మేనులు గలసెఁ బిదపఁ
గలసె నాత్మలు విధులును గలసె నిపుడు
కలిపెదముగాక బ్రదుకు చావులను గూడ.” ౧౫